## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120000620

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

**Digital Library of India**

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కలం బలం





రేగులపాటి కిషన్‌రావు

కలం బలం

విజయలక్ష్మీ పబ్లికేషన్స్ ప్రచురణ నెం. 15
ప్రథమ ముద్రణ డిసెంబర్ 1996.

## కవితల సూచిక



ముద్రణ: విష్ణు ప్రింటింగ్ ప్రెస్
సిరిసిల్ల-505301.

వెల: రు. 10-00

1

ఇదే ఇదే మన దేశం ఇది పవిత్రదేశం
ఇదే ఇదే మన దేశం ఇది భారతదేశం ॥ఇదే॥

అత్యున్నత హిమనగమ్ము వింధ్యాసాత్పూరమ్ములు
పవనాలను ఆపి మంచి వర్షాలను కురిపించును ॥ఇదే॥

ఈ దేశపు పీఠభూమి ఖనిజాలకు పుట్టినిల్లు
మన దేశపు మైదానం పంటల దాన్యాగారం ॥ఇదే॥

కృష్ణగంగ గోదావరి మహానదులు ప్రవహించుచు
మానవ పశుపక్ష్యాదుల ప్రాణాలను కాచుచుండు ॥ఇదే॥

మర్రి మద్ది వేపచెట్లు టేకు రావిలాంటి చెట్లు
కలిగివున్న అరణ్యాలు పెరిగివున్న మనదేశం ॥ఇదే॥

బియాసు బాక్రానంగల్ హిరాకుడూ నాగార్జున
ప్రాజెక్టులతో సంపద పొందుచుండు మనదేశం ॥ఇదే॥

వరి గోధుమ చెఱకు జనుము కొబ్బరి తేయాకు ప్రత్తి
మెండుగ పండించునట్టి దండిరైతుగల దేశం ॥ఇదే॥

ఆవులు గేదెలు మేకలు పెంచి పాడిపంచునట్టి
ఓర్పు నేర్పుగల రైతులు కలిగివున్న మనదేశం ॥ఇదే॥

ప్రకృతి రమణీయమైన అందాలను వెదజల్లుచు
మనములలో ఆనందపు విరిజల్లులు కురిపించును ॥ఇదే॥

పలుమతాలు పాటించేవారు గలరు దేశమ్మున
అందమైన భాషలెన్నొ భాషించేవారు గలరు ॥ఇదే॥

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పరిపాలన చేయుచుండు
సౌఖ్యానికి ఐక్యానికి జనత పాటుబడుచుండును ॥ఇదే॥

సత్య నీతి శౌర్యాలను పాటించును మనదేశం
అహింసాది ధర్మాలను ఆచరించు మనదేశం ॥ఇదే॥

రేగులపాటి కిషన్‌రావు

## 2

కలం పట్టవోయి కవీ కలం పట్టవోయి
దుర్నీతిని నిరసించి అధర్మాన్ని ఖండించి
ధర్మ సంస్థాపనకై కలం పట్టవోయి.
కలం పట్టవోయి కవీ కలం పట్టవోయి.

అసత్యాన్ని అణగగొట్టి అవినీతిని దెబ్బగొట్టి
నీతీ సత్యాల బలము నిలబెట్టుటకై
కలం పట్టవోయి కవీ కలం పట్టవోయి
శ్రమశక్తిని పొగడి పొగడి సోమరులను తెగడి తెగడి
శ్రమజీవికి గౌరవాన్ని కలిగించుటకై
కలం పట్టవోయి కవీ కలం పట్టవోయి.

కులమత విభేదాల కుళ్లునీవు తొలగించి
ప్రాంతీయ విభేదాల చీకట్లను రూపుమాపి
జాతి జనుల మధ్య ప్రేమ జ్యోతులు వెలిగించుటకై
కలం పట్టవోయి కవీ కలం పట్టవోయి.

భాషలు వేర్వేరైనా భావమొక్కటేనని
జాతి ఒక్కటేనని మన నీతి ఒక్కటేనని
తెలుపుటకై మన జాతి ఖ్యాతి నిలుపుటకై
దుష్టబుద్ధి కలవారి దుమ్ముదులుపుటకై
నీతిని ఈ దేశములో నిలుపుటకై
విశ్వములో మన ఖ్యాతిని నిలుపుటకై
కలం పట్టవోయి కవీ కలం పట్టవోయి.

## 3

కరిగిపొమ్మంటారు కొవ్వొత్తినై
నన్ను కాలిపొమ్మంటారు కొవ్వొత్తినై
వెలుగులిమ్మంటారు కొవ్వొత్తినై
నన్ను వెలిగిపొమ్మంటారు కొవ్వొత్తినై
త్యాగ జీవిని నేను కావాలనేవారు
త్యాగాలు చేయంగ లేరేమిటి?

వర్షించుమంటారు మేఘమ్మునై
నన్ను వర్షించుమంటారు మేఘమ్మునై
కురిపించుమంటారు జలధారలు
నన్ను కురిపించుమంటారు జలధారలు
కరిగిపొమ్మంటారు నీరుకమ్మంటారు
ఏరు కమ్మంటారు ఏమేమో అంటారు
త్యాగజీవిని నేను కావాలనేవారు
త్యాగాలు చేయంగ లేరేమిటి?

ఫలములిమ్మంటారు వృక్షమ్మునై
నన్ను ఫలములిమ్మంటారు వృక్షమ్మునై
నీడనిమ్మంటారు వృక్షమ్మునై
నన్ను నీడనిమ్మంటారు వృక్షమ్మునై
పువ్వులిమ్మంటారు తేనె నిమ్మంటారు
ఆకులిమ్మంటారు ఏమేమో అంటారు
త్యాగజీవిని నేను కావాలనే వారు
త్యాగాలు చేయంగ లేరేమిటి?



# 4

సాగిరావే కృష్ణవేణి
రావె రావే కరుణచూపి
సాగి రావే కృష్ణవేణి
రావె మాపై కరుణ చూపి ॥సాగిరావే॥

మెల్లమెల్లగ కొండలను దిగి
నాగదేవతలాగ నడచుచు
సాగిరావే కృష్ణవేణి
రావె మాపై కరుణచూపి ॥సాగిరావే॥

యుక్త వయసులో చెరువులనుగని
పయోధారలు పంచి నీవు
పెంచి మంచి ఫలితమిచ్చి
సాగిరావే కృష్ణవేణి
రావె మాపై కరుణ చూపి ॥సాగిరావే॥

నీకు స్వాగతమిచ్చు చెట్లకు
పచ్చచీరలు పచ్చరవికలు
పంచిపెడుతూ పంచిపెడుతూ
సాగిరావే కృష్ణవేణి
రావె మాపై కరుణచూపి ॥సాగిరావే॥

నిన్ను కొలిచే జీవకోటికి
దండిగానూ తిండిపెడుతూ
సాగిరావే కృష్ణవేణి
రావె మాపై కరుణచూపి ॥సాగిరావే॥

## 5

వచ్చె వచ్చె నీలి మబ్బు
తెచ్చె తెచ్చె వాన జల్లు
నీలి మబ్బు వచ్చె వచ్చె
వానజల్లు తెచ్చె తెచ్చె ॥వచ్చె॥

నేల మేను పులకించగ
మోడు బ్రతుకు చిగురించగ
వచ్చె వచ్చె నీలి మబ్బు
తెచ్చె తెచ్చె వానజల్లు ॥వచ్చె॥

కర్షకులూ శ్రామికులూ
హర్షమ్మును ప్రకటించగ
వచ్చె వచ్చె నీలి మబ్బు
తెచ్చె తెచ్చె వానజల్లు ॥వచ్చె॥

మండుకములు మయూరములు
సంతసించి గంతులేయ
వచ్చె వచ్చె నీలి మబ్బు
తెచ్చె తెచ్చె వానజల్లు ॥వచ్చె॥

అందమైన చందమామ
అందాలను దాచివేసి
చక్కనైన చుక్కలనూ
చిక్కకుండ దాచివేసి
వచ్చె వచ్చె నీలి మబ్బు
తెచ్చె తెచ్చె వానజల్లు ॥వచ్చె॥



పాడరారా! పాడరారా!
పాడి పరవశమొందరారా ||పాడరారా||

జన్మభూమి స్వేచ్ఛకొరకై
శక్తియుక్తులు సమర్పించిన
త్యాగజీవుల ధన్యచరితలు ||పాడరారా||

ధర్మబద్ధముగాను పాలన
చేసి ఖ్యాతిని పొందినట్టి
చక్రవర్తుల కీర్తి చరితలు ||పాడరారా||

మాతృభాషలో మహాకావ్యము
లల్లి భాషకు కీర్తి తెచ్చిన
మహాకవుల మాన్యచరితలు ||పాడరారా||

కళలకోసం జీవితాలను
అంకితమ్మొనరించినట్టి
కళాకారుల క్రాంతి చరితలు ||పాడరారా||

## 7

తెల్లని మల్లెలు కమ్మని తావిని
పంచుచు బ్రతుకును ఎందులకో?
పరిమళాలు వెదజల్లే పద్మం
పంకిలమందున పుట్టునెందుకో?
నల్లని కోకిల కమ్మని స్వరముతో
పాటలు పాడును ఎందులకో?
చూడచక్కని నెమలి యువకుడు
నాట్యము చేయును ఎందులకో?



## 8

చెట్టులాగ జీవిస్తే జీవితమే ధన్యం
త్యాగబుద్ధి కలిగివున్న మానవుడే దైవం. ॥చెట్టు॥
ఆశ్రితులకు చెట్టు నీడ అందిస్తుంది
అన్నార్తుల కడుపునింపి మెప్పిస్తుంది ॥చెట్టు॥
పువ్వులనూ ఫలాలనూ అందిస్తుంది
ఫలమేమియు ఆశించక జీవిస్తుంది. ॥చెట్టు॥
స్వచ్ఛమైన గాలి తాను కల్పిస్తుంది
పవనాలను ఆపి వాన కురిపిస్తుంది. ॥చెట్టు॥
నరికివేసి తన ప్రాణం తీసివేసినా
వాడుకునే వస్తువుగా జీవిస్తుంది. ॥చెట్టు॥
మన పెద్దలు వృక్షాలను పూజించారు
చెట్టును ఒక దేవతగా భావించారు. ॥చెట్టు॥
చెట్టు నరికితే రెండూ చెట్లు నాటితే ముద్దు
విచక్షణా లేకుండా చెట్లు నరకడం వద్దు. ॥చెట్టు॥

## 9

నింగిలోన మేఘమ్ములు తిరుగునెందుకు?
నేలపైన వృక్షజాతి పెరుగునెందుకు?
మబ్బులు వర్షించుటకై తిరుగుచుండును.
చెట్లు పలాలిచ్చుటకై పెరుగుచుండును.
మారుతమ్ము అటూ ఇటూ తిరుగునెందుకు?
మార్తాండుడు వేడి వెలుగు పంచునెందుకు?
సమీరణుడు తిరిగి తిరిగి జీవుల రక్షించుచుండు.
రవి వెలుగును అందిచుచు ప్రాణుల పోషించుచుండు.

## 10

హలం పట్టి పొలం దున్ని
పంటలు పండించాలని
పంటలు పండించి దండి
రైతు నేను కావాలని
కాంక్ష నాకు కలదోయి.

కలంపట్టి కలంపట్టి
భావాలకు పదును పెట్టి
మధురమైన కవితలల్లి
కవిరాజును కావాలని
కాంక్ష నాకు కలదోయి.

గళం విప్పి గళం విప్పి
గేయాలను పాడాలని
గేయాలను పాడిపాడి
గాయకుడను కావాలని
కాంక్ష నాకు కలదోయి.

చిత్రాలను గీసిగీసి
కనువిందుగ రంగువేసి
ప్రముఖ చిత్రకారునిలా
పేరు నేను పొందాలని
కాంక్ష నాకు కలదోయి.

మయూరిలా నాట్యమాడి
హరుని మెప్పు పొందాలని
నాట్యకళను నలుగురికీ
నేర్పి పేరు పొందాలని
కాంక్ష నాకు కలదోయి.



శిలలు చెక్కి రకరకాల
విగ్రహాలు చేయాలని
శిల్పకళను పెంపుజేసి
జనం మెప్పు పొందాలని
కాంక్ష నాకు కలదోయి.

## 11

పంట కొరకు వంట కొరకు
కమ్మనైన తిండి కొరకు
శ్రమించాలి శ్రమించాలి శ్రమించాలిరా.

నీడకొరకు తోడుకొరకు
ఒంటినిండ గుడ్డకొరకు
శ్రమించాలి శ్రమించాలి శ్రమించాలిరా.

విద్యకొరకు బుద్ధికొరకు
సుఖపడు మార్గాలకొరకు
శ్రమించాలి శ్రమించాలి శ్రమించాలిరా.

మాటకొరకు మూటకొరకు
సమతకొరకు మమతకొరకు
శ్రమించాలి శ్రమించాలి శ్రమించాలిరా.

నీతికొరకు నిజంకొరకు
మనిషిపొందు ఖ్యాతికొరకు
శ్రమించాలి శ్రమించాలి శ్రమించాలిరా.

శాంతికొరకు క్రాంతికొరకు
పరమోన్నత స్థాయికొరకు
శ్రమించాలి శ్రమించాలి శ్రమించాలిరా.

శ్రమ గొప్పది శ్రమ గొప్పది
శ్రమ సర్వము సృష్టించును
శ్రమించాలి శ్రమించాలి శ్రమించాలిరా.

## 12

చెట్లు పెంచండీ బాబు చెట్లు పెంచండీ మీరు
ఆకుకోసం కర్రకోసం స్వచ్ఛమైన గాలికోసం ॥చెట్లు॥

నీడకోసం వానకోసం పూలకోసం తావికోసం
కడుపునింపీ హాయినిచ్చే మధుర మధుర ఫలాలకోసం ॥చెట్లు॥

వేప మర్రి రావి కొబ్బరి చింత మామిడి అరటిచెట్లు
పెట్టి నీరు పోసిపోసి శ్రద్ధ ఎంతొ చూపి చూపి ॥చెట్లు॥

పెద్దచెట్టో చిన్న చెట్టో పూలచెట్టో కాయచెట్టో
పెంచగలిగిన నచ్చినట్టి చెట్లు పెట్టండీ బాబూ ॥చెట్లు॥

## 13

కోకిలమ్మ కోకిలమ్మ పాడవమ్మ పాడవమ్మ
కోకిలమ్మ పాడవమ్మ పాడవమ్మ కోకిలమ్మ.

తీయని రాగాలు తీసి దిగులు తీసివేయవమ్మ
హాయినిచ్చె పాటపాడి మనసు తీపి చేయవమ్మ.

గున్నమావి కొమ్మమీద నిలిచి నువ్వు పాడవమ్మ
పండ్లలోన పరిమళములు చేరునట్లు పాడవమ్మ.

నింగిలోపల తిరిగి తిరిగి వానపాటలు పాడవమ్మ
వాన కురువగ మనసు మురువగ పాట నువ్వూ పాడవమ్మ.



## 14

ఇంతవరకు కొంతవరకు భయముండేది
పడవ పగిలి మునుగుదునని భయముండేది.

బెస్త కులములోన బుట్టి
వలతో చేపలను బట్టి
అమ్ముకొనీ జీవించే
జాతిస్త్రీనైనందుకు
ఇంతవరకు కొంతవరకు భయముండేది.

సంద్రముపై సాగిపోయి
తిరిగి వచ్చునంతవరకు
పడవ పగిలి మునుగుదునని భయముండేది
ఇంతవరకు కొంతవరకు భయముండేది.

కన్నవారు కన్నుమూసి
ఏకాకిని నన్ను చేసి
వెళ్లినాక బ్రతుకు కొరకు భయముండేది
ఇంతవరకు కొంతవరకు భయముండేది

అంగడిలో చేపలనూ
అమ్ముటకూ పోయినపుడు
చేపలనూ అమ్మి అమ్మి
ఇంటికి నే ఎచ్చునపుడు
మాట మాట కలిపినోడు
మంచి మాట చెప్పినోడు
మనసులోని మాట చెప్పి
మనువాడుదునన్నాడు.

వయసులోన ఉన్న దాణ్ని
మనసులోన ఉన్న వాణ్ని
మనువాడితి మనువాడితి
మనువాడితి మంచిరోజు.

నాకళ్లకు అందగాడు
నా నాథుడు నా నాథుడు
వయసులోన ఉన్న వాణ్ని
మనసులోన ఉన్న వాణ్ని
వదలలేక వదలలేక
సఖునితోడు వదలలేక
ఇల్లు వదలి పడవనెక్కి
సంద్రముపై వెళ్లునాకు
భయమేమిటి భయమేమిటి
భయమేమిటి నాకిప్పుడు?
పడవ పగిలినా నీటమునిగినా
భయమేమిటి భయమేమిటి
భయమేమిటి నాకిప్పుడు?

పడవ పగిలినా నీటమునిగినా
నీట మునిగి నీటిపాలు
కాకుండా కాపాడే
ప్రాణవిభుడు తోడుండగ
భయమేమిటి భయమేమిటి
భయమేమిటి నాకిప్పుడు?

ఇంతవరకు కొంతవరకు భయముండేది
పడవ పగిలి మునుగుదునని భయముండేది.

## 15

ఎందుకోయీ ఎందుకోయీ
ప్రతిభలేని ప్రగతిలేని
బ్రతుకు నాకిది ఎందుకోయీ
ఎందుకోయీ ఎందుకోయీ.
పురుగులాగ పక్షిలాగ
కుక్కలాగ నక్కలాగ
ఫలములివ్వని చెట్టులాగ
పంటనివ్వని నేలలాగ
బ్రతుకు బ్రతుకుట ఎందుకోయీ.
ఎండలోన ఎండిపోతూ
వానలోన తడిసిపోతూ
శీతకాలం వణికిపోతూ
ఎంతకాలం బ్రతికియున్నా
ఏమిలాభం ఏమిలాభం?
పగిలిపోయే రాయిలాగ
పరువులేని జీవిలాగ
బ్రతకడం మరి ఎందుకోయీ
ఎందుకోయీ ఎందుకోయీ.
కన్నవారు కన్నవెంటనె కన్నుమూశారు.
తోడబుట్టిన వారులేక
ఆదరించేవారు లేక
నా అనెడి వారులేక
నాది అన్న ఆస్తిలేక
బిచ్చగాడిలా జీవితాన్ని వెళ్లదీశాను.
చదువులేక సంధ్యలేక
పనులు చేయుట నేర్చుకోక

ఆటపాటలు లేని బ్రతుకును వెళ్లదీశాను.
రోగమొస్తే నొప్పిఅయితే
మందులేక మాకులేక
రోజుకొక్క రోగిలాగ
చచ్చి బ్రతికాను.
ఎవరో ఇచ్చిన పాతబట్టలు
కట్టుకున్నాను.
పరులు పోసిన గంజినీళ్లు
త్రాగి బ్రతికాను.
చెట్టుక్రింద చూరుక్రింద
పురుగులాగ నురుగులాగ
గాలిలోని ధూళిలాగ
ధూళిలోని గాలిలాగ
దీనమైన హీనమైన
బ్రతుకు బ్రతికాను.
ఎన్నెన్నో కష్టాలు అనుభవించాక—
ఎంతెంతో వేదనను అనుభవించాక—
కాలం కబళించాలని
కాలం కరుణించాలని
కట్టెలాంటి ఈకాయం
కాలి బూడిదైపోవాలని
కోరరాని కోరరాని
కోర్కె కలిగింది.
లేకపోతే లేకపోతే
ఎందుకోయీ ఎందుకోయీ
దీనమైన హీనమైన
బ్రతుకు నాకిది ఎందుకోయీ.

## 16

భాష నేర్చుకో
తెలుగు భాషనేర్చుకో.
తెలుగు భాష నేర్చుకొని
తెలివి పెంచుకో. ॥భాష॥

తెలుగు భాష అక్షరాలు
తెలివిగాను నేర్చుకో.
చదువ వ్రాయ నేర్చుకొని
చైతన్యం పెంచుకో. ॥భాష॥

అక్షరాలు కలిపి నీవు
పదజాలం పెంచుకో.
పదము పదము పలికినీవు
భావం ప్రకటించుకో. ॥భాష॥

మంచిమాట పలికినీవు
మమకారం పెంచుకో.
అనుబంధం పెంచుకొని
ఆత్మీయత పంచుకో. ॥భాష॥

చతురోక్తులు ప్రయోగించి
భాషించుట నేర్చుకో.
మంచి మనసు గలవారిని
స్నేహంతో పెంచుకో. ॥భాష॥

అమ్మా! అని పిలిచి నీవు
ఆహారం కోరుకో.
నాన్నగారి శిక్షణలో
వృత్తివిద్య నేర్చుకో. ॥భాష॥



ఆవుపాలు శ్రేష్ఠమనీ
నువ్వు తెలుసుకో.
పుష్టినిచ్చు పాలు త్రాగి
ఆరోగ్యం పెంచుకో. ॥భాష॥

చక్కనైన పథకముతో
భవనం నిర్మించుకో.
నచ్చినట్టి వ్యక్తితోనె
బ్రతుకు నువ్వు పంచుకో. ॥భాష॥

## 17

సజ్జనుడొక్కడు
పైస పాలుకొని
పసి పిల్లలకే ఇచ్చాడు.
ఆ సజ్జనుడే
పైస రొట్టెకొని
ఆకలి కడుపులు నింపాడు.
అదే సజ్జనుడు
పైస నీరుకొని
పదుగురి దాహం తీర్చాడు.

దురాత్ముడొక్కడు
మూడు పైసలతో
తుపాకి ఒక్కటి కొన్నాడు.
పదుగురి పాలురొట్టె గుంజుకొని
పొట్టలావుగా పెంచాడు.
(మాధవరావు రేగులపాటి గారి హిందీ కవిత ఆధారంగా)

## 18

తెలియదాయెను తెలియదాయెను
బ్రతుకు కర్థము తెలియదాయెను.
ఎందుకొరకూ పుట్టినామో
ఎందుకొరకూ పెరిగినామో
పుట్టిపెరిగీ చచ్చువరకూ
ఎందుకొరకూ బ్రతుకుతామో
తెలియదాయెను తెలియదాయెను
బ్రతుకు కర్థము తెలియదాయెను.

విద్యలన్నియు ఎందుకొరకో
లలితకళలవి ఎందుకొరకో
పుట్టి పెరిగీ చచ్చువరకూ
పనులు చేయుట ఎందుకొరకో
తెలియదాయెను తెలియదాయెను
బ్రతుకు కర్థము తెలియదాయెను.

ఆలుబిడ్డలు ఎందుకొరకో
ఆస్తిపాస్తులు ఎందుకొరకో
పుట్టిపెరిగీ చచ్చువరకూ
వావివరుసలు ఎందుకొరకో
తెలియదాయెను తెలియదాయెను
బ్రతుకు కర్థము తెలియదాయెను.

నీతి ధర్మము న్యాయమంటూ
శాస్త్రచర్చలు ఎందుకొరకో
పుట్టి పెరిగీ చచ్చువరకూ
ధర్మ సందేహములు ఎందుకో.

## 20

ఈ వియోగ గీతములను
పాడుకొనుము పాడుకొనుము.
వియోగమున పొందు బాధ
తెలుసుకొనుము తెలుసుకొనుము.

ఈ విషాద గీతములను
పాడుకొనుము పాడుకొనుము.
విషాదమును సహనముతో
ఓర్చుకొనుట నేర్చుకొనుము.

ఈ భక్తి గీతములను
పాడుకొనుము పాడుకొనుము.
భక్తిముక్తినిచ్చునను
భావమ్మును తెలుసుకొనుము.

## 21

అతని వదనము కాంతిహీనము
అతని కన్నులు నీటి మడుగులు
అతడు ఒంటరివాడు అతడు ఒంటరివాడు.

కుష్ఠురోగముతో శరీరము
వికారముగా మారిపోయెను.
చీమునెత్తురు కారుచుండెను
ఈగలేమో ముసురుచుండెను.
అతని వదనము కాంతిహీనము
అతని కన్నులు నీటి మడుగులు
అతడు ఒంటరివాడు అతడు ఒంటరివాడు.

ఎవరి ఇంటికి వెళ్లినిలిచిన
తొలగిపొమ్మని కసురుకొందురు.
ఏమి ఇవ్వనివారు కూడా
అసహ్యాముగా చూచుచుందురు.
అతని వదనము కాంతిహీనము
అతని కన్నులు నీటి మడుగులు
అతడు ఒంటరివాడు అతడు ఒంటరివాడు.

ఎవరి ప్రేమను పొందనట్టి
దీనుడాతడు హీనుడాతడు.
ఎవరిస్నేహం పొందనట్టి
హీనుడాతడు దీనుడాతడు.
అతని వదనము కాంతిహీనము
అతని కన్నులు నీటి మడుగులు
అతడు ఒంటరివాడు అతడు ఒంటరివాడు.

పెద్దరోగం పెరిగిపోయెను
కంపువాసన పెరిగిపోయెను
తరిమికొట్టేవారి సంఖ్యయు
పెరిగిపోయెను పెరిగిపోయెను.
కుమిలి కుమిలి ఏడ్చేనాతడు
కళ్లి కుళ్లి చచ్చేనాతడు
దిక్కుమొక్కూ లేని శవమును
ఈడ్చివేసిరి కాల్చివేసిరి.



నేల లేక నీడలేక
కట్టడానికి బట్టలేక
తల్లడిల్లే పేదవాడు
ఎలాబ్రతుకును ఎలాబ్రతుకును?
బ్రతుకు బరువును ఎలా మోయును?

పేదవానికి పిల్లలుంటె
పేదవానికి తల్లివుంటె
చెట్టుకింద నేల మీద
సొమ్మసిల్లి వారు వుంటె
పిడికెడన్నం పెట్టలేని
పేదవాని గుండెకోత
ఎలావుండును ఎలావుండును?

రోగమొచ్చి మందులేక
కన్నతల్లి చచ్చిపోతే
బుక్కెడన్ని పాలులేక
బిడ్డ కట్టెగ మారిపోతే
పేదవాని గుండెబిచ్చు
ఎలా మారును ఎలా ఆరును?

నేల లేక కూడు లేక
గూడు లేక గుడ్డ లేక
బ్రతుకునిండా బాధనిండి
కడుపు యెండి కడుపు మాడి
పేదవాడు కన్నుమూస్తే
ఎవరు బాధ్యులు ఎవరు బాధ్యులు?

## 24

ఏ వెదురు మురళియై
మోవిపై నిలుచునో?
నీ మోవిపై నిలచి
రవళియై మ్రోగునో?

ఏ నెమలి పింఛమ్ము
నీ శిరము చేరునో?
నీ శిరముపై నిలచి
కాంతి వెదజల్లునో?

ఏ పూలు నీ పాద
యుగళిపై వ్రాలునో?
నీ పాదములు తాకి
పరవశము పొందునో?

## 25

చిన్నతనమున తల్లి ఒడిలో
కూరుచుంటిని పాట వింటిని
ముద్దు ముద్దుగ ఆట పాటల
తోడ గడిపితినీ.

బాల్యదశలో బడికి వెళ్లితి
భక్తి శ్రద్ధలతోడ చదివితి
వివిధ రకముల విద్యలన్నియు
నేర్వగలిగితినీ.

యుక్త వయసులో వల పెరింగితి
సుందరాంగిని పెండ్లియాడితి
కష్టసుఖములు పంచుకొంటూ
బ్రతుక గలిగితినీ.

తండ్రినైతిని తాతనైతిని
ముందుతరమును పెంచగలిగితి
ముసలితనమున బ్రతుకు బరువును
ఎలా మోయుదునో?

## 26

నేను గంగను నేనుగంగను
హిమవంతుని గర్భమ్మున
జననమొందిన దాననూ. ॥నేను॥

పుట్టగానె నడకనేర్చి
నడచి నడచి పుడమి పైకి
చేరవచ్చిన దాననూ. ॥నేను॥

చూడవచ్చిన వారలకు నా
నాట్యభంగిమ ప్రదర్శించుచు
ప్రమోదమ్మును కూర్చుదానను. ॥నేను॥

సుడులు తిరుగుచు పరుగు తీయుచు
పరవశమ్మున పాటపాడుచు
సాగిముందుకు పోవుదానను. ॥నేను॥

వయసు పెరుగగ వలపు తెలియగ
మనసెరింగిన కడలి బావను
చేరవచ్చిన కన్నెపిల్లను. ॥నేను॥



## 27

అస్థిపంజరం అస్థిపంజరం
అదే అదే మానవుని
అస్థిపంజరం అస్థిపంజరం.
మరణించిన మానవుని
అస్థికలను తీగలతో
బంధించి దాచినట్టి
అస్థిపంజరం అస్థిపంజరం.
అదే అదే మానవుని
అస్థిపంజరం అస్థిపంజరం.
గణన చేయ వీలుండే
అస్థికలను కలిగియున్న
అస్థిపంజరం అస్థిపంజరం.
అదే అదే మానవుని
అస్థిపంజరం అస్థిపంజరం.
అస్థికలూ అస్థికలూ అస్థికలే
అవి ఆడదాని అస్థికలో
మగరాయుని అస్థికలో
చూడగానె తెలుసుకొనుట సాధ్యమా?
అవి మగవాడి అస్థికలే అనుకున్నా —
అతడు జీవించిన కాలంలో
సుందరుడో కురూపియో
చెప్పుటకూ వీలుందా?
పొడుగువాడొ పొట్టివాడొ
చెప్పుటకూ వీలున్నా
నల్లవాడొ తెల్లవాడొ

గుణవంతుడో గుణహీనుడో
ధనవంతుడో ధనహీనుడో
బలవంతుడో బలహీనుడో
చెప్పమనకు వీలుందా?
కులమేదో మతమేదో, భాషించిన భాషేదో
పాటించిన ఆచారం ఏదేదో ఏదేదో
చెప్పమనకు వీలుందా?
అతని తల్లి అతని తండ్రి
తోబుట్టువులెవరెవరో
బంధువులు స్నేహితులు
ఎవరెవరో ఎవరెవరో
చెప్పమనకు వీలుందా?
ఎచ్చోట జన్మించి ఎచ్చోట జీవించి
ఎచ్చోట ఎచ్చోట తిరిగి తిరిగీ
అతడు ఇచ్చోటికీ వచ్చినాడో
చెప్పమనకు వీలుందా?
ఎందరికి సహకారమందించినాడో
ఎందరి సహకారమును పొందినాడో
జీవితమున అతడేమి సాధించినాడో
చెప్పగలమా మనము చెప్పగలమా?
ఆ వివరాలు వివరంగ చెప్పగలమా?
మానవుడు జీవించి ఉన్నప్పుడే
వేలాది వేలాది భేదాలు
అస్థికలకు లేవుగదా
ఇన్నిన్ని ఇన్నిన్ని భేదాలు.

***

## 28

లంచం దయ్యం ఎక్కడ? ఎక్కడ ఎక్కడ ఎక్కడ?
ఇక్కడ ఇక్కడ ఇక్కడ లంచం దయ్యం ఇక్కడ.
లంచం దయ్యం ఎక్కడ? ఎక్కడ ఎక్కడ ఎక్కడ??
అక్కడ అక్కడ అక్కడ లంచం దయ్యం అక్కడ.

అవినీతిని ఆశ్రయించిన
అధికారుల మనసులలో
దాగిఉంది దయ్యం
అదే లంచం దయ్యం.

అన్యాయము నాశ్రయించిన
అధికారుల చేష్టలలో
ఎగురుతుంది దయ్యం
అదే లంచం దయ్యం.

అధర్మాన్ని ఆశ్రయించిన
అధికారుల మాటలలో
పలుకుతుంది దయ్యం
అదే లంచం దయ్యం.

అసత్యాన్ని ఆశ్రయించిన
అధికారుల రాతలలో
ఇరుక్కుంది దయ్యం
అదే లంచం దయ్యం.

ఇక్కడ చూచిన అక్కడ చూచిన
ఎక్కడ చూచిన లంచమే.
ఇక్కడ అక్కడ ఎక్కడ చూచిన
లంచం లంచం లంచమే.



దేశమాత స్వేచ్ఛ కొరకు
పోరాడిరి కొందరు.
భాషా రాష్ట్రాల కొరకు
అలిగినారు కొందరు.
స్త్రీ జాతిని ఉద్ధరించ
పాటుబడిరి కొందరు.
లంచానికి వ్యతిరేకత
ప్రకటించిరి ఎందరు?
లంచగొండితనం వద్దు
వద్దన్నది ఎందరు?

దొంగతనముచేయుట ఒక
నేరము అయితే—
దోపిడీలు చేయుట ఒక
నేరము అయితే—
లంచాలు పుచ్చుకొనుట
నేరము కాదా?

దొంగతనము చేసినట్టి దొంగలూ
జైలులోన కనిపింతురు కొందరు.
దోపిడీలు చేసినట్టి దోపిడిగాండ్రూ
చెఱసాలలొ కనిపింతురు కొందరు.
లంచగొండి అధికారులు ఎందరు
కటకటాల వెనుక నీకు కనిపిస్తారు?

మంచి మార్పు కొరకు నీవు
ప్రయత్నించు ప్రయత్నించు.
చట్టాలను పాటించుచు
లంచమ్మును ప్రతిఘటించు.

## 29

వాయు రథముపైన నీవు
రయమున ఇటు చేరరమ్మ మేఘమా! ఓ మేఘమా!

విరికన్నెలు నీరులేక
వాడి నేల రాలసాగె మేఘమా! ఓ మేఘమా!

పరువములో ఉన్న చేలు
నీరులేక ఎండసాగె మేఘమా! ఓ మేఘమా!

ఎండుచున్న పైరు చూచి
రైతురాజు ఏడ్వసాగె మేఘమా! ఓ మేఘమా!

పక్షితతులు నిన్ను చూడ
ఎగిరి ఎగిరి వెదకసాగె మేఘమా! ఓ మేఘమా!

పశువులెన్నొ నీటికొరకు
తిరిగి తిరిగి వెదకసాగె మేఘమా! ఓ మేఘమా!

జనులెందరొ నీకోసం
ప్రతీక్షించుచున్నారిట మేఘమా! ఓ మేఘమా!

వర్షమ్మును బాలినంత
కురిపించగ రమ్మ రమ్మ మేఘమా! ఓ మేఘమా!

హర్షమ్మను ఎద ఎదలో
కలిగించగ రమ్మ నీవు మేఘమా! ఓ మేఘమా!

వాయు రథము పైన నీవు
రయమున ఇటు చేరరమ్మ మేఘమా! ఓ మేఘమా!

## 30

మహాత్మా! మళ్ళీ పుట్టిరావయ్యా!
మాలోకి మహిలోకి మళ్ళీపుట్టి రావయ్యా
మహాత్మా! మళ్ళీపుట్టి రావయ్యా!
భారత ప్రజల స్వేచ్ఛకోసమై
భోగములన్నియు త్యాగము చేసిన
బోసినవ్వుల తాతయ్యా!
మళ్ళీపుట్టి రావయ్యా! రావయా!
మహాత్మా! మళ్ళీపుట్టి రావయ్యా!
స్వార్థముకన్నను త్యాగము మిన్నని
బ్రతుకులోన చూపించిన బాపూ!
మళ్ళీపుట్టి రావయ్యా! తాతయ్యా!
మహాత్మా! మళ్ళీపుట్టి రావయ్యా!
శాంతియుతముగా ఉద్యమాలను
నిర్వహించీ నిర్వహించీ
జాతిజనులకు స్వేచ్ఛ తెచ్చిన
మహాత్మా! మళ్ళీపుట్టి రావయ్యా!
శాంతినికోరే దేశములో మన దేశములో
హింసాధోరణి రగులుతున్న
ఈ తరుణములో తరుణములో
అహింసయే ప్రథమ ధర్మమని
చాటిచెప్పగా రావయ్యా!
మహాత్మా! మళ్ళీపుట్టి రావయ్యా!
త్యాగ ధనం శాంతి ప్రబోధము
పంచిపెట్టి ప్రతి మనిషి గుండెలో
మమతల మల్లెలు పూయించుటకై
మహాత్మా! మళ్ళీపుట్టి రావయ్యా!

# 31

నీకూ నాకూ అతనికి ఆమెకు
న్యాయం జరగాలీ.
పనిలో శ్రమలో ఫలము పొందుటలో
న్యాయం జరగాలీ. ॥నీకూ॥

కులమేదైనా మతమేదైనా
న్యాయం జరగాలీ.
యువకులకైనా యువతులకైనా
న్యాయం జరగాలీ. ॥నీకూ॥

ప్రతి పౌరునకూ పని కల్పించే
ప్రణాళికలనే వేయాలీ.
పని యేదైనా ప్రతి పౌరునకూ
బ్రతుకుదెరువుగా ఉండాలీ. ॥నీకూ॥

దేశంలోని అన్ని వనరులను
సద్వినియోగం చేయాలీ.
వివిధ వనరులను వినియోగించి
వివిధోత్పత్తులు పెంచాలీ. ॥నీకూ॥

వివిధ యంత్రములు వినియోగింపీ
పనులను సులభం చేయాలీ.
నిరుద్యోగమూ సోమరితనమూ
శాశ్వతంగ తొలగించాలీ. ॥నీకూ॥

సమతా మమతా సమాజమందున
స్థాపన చేయాలీ మనమూ స్థాపన చేయాలీ.
నీతీ న్యాయం సమాజమందున
స్థాపన చేయాలీ మనమూ స్థాపన చేయాలీ.

## 32

చిలిపి కృష్ణుడే వాడు చిన్ని కృష్ణుడే
కొంటె పనులు చేయునట్టి కొంటె కృష్ణుడే.

కడుముంతెడు పెరుగు నేను
ఉట్టిమీద పెట్టిపోతె
కుండనెక్కి ఉట్టివాడు
ఖాళీచేసి వెళ్ళినాడు. ॥చిలిపి॥

కడవలోన పెరుగుబోసి
చల్ల నేను చెయ్యబోతె
కవ్వానిది త్రాడుదీసి
చల్లచెయ్యకుండ జేసె ॥చిలిపి॥

చెయ్యితోటి పెరుగు చిలికి
వెన్న నేను తియ్యగానె
చెయ్యిలోని వెన్నవాడు
చేతబట్టుకెళ్ళినాడు. ॥చిలిపి॥

వెన్న దొంగతనముజేసి
వాడువెళ్ళి పోతుంటే
వెంటబడ్డ వెలది మోము
వెన్న పాలు జేసినాడు. ॥చిలిపి॥

అవతలింటి కోడలామె
మూతికింత పెరుగుబూసి
అత్తాకోడండ్ల మధ్య
తాకులాట పెట్టినాడు. ॥చిలిపి॥